## గంటల పంచాంగం

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ ద్వాదశి 1956- సం॥ ఏప్రిల్ 8 ఆదివారం బ॥ ద్వాదశి 9-29 శత 11-15 వర్జ్యం 17-50 ల 19-29 వ.

బ॥ త్రయోదశి ఏప్రిల్ 9 సోమవారం పోర త్రయోదశి 9-37 పూ భా 11-58 వర్జ్యం 21-36 ల 23-13 వ.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయని మొసరించిన
వరవర యుద్ధియము తన మనంబున కగు దా
నొరులకు నది సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ మన్మథ సం॥ ఫాల్గున బ॥ ద్వాదశి
ఆదివారం


## బిల్లుకు ఆమోదం

కొత్త రాష్ట్రాల బిల్లులోని ఆంధ్ర-తెలంగాణా విలీనీకరణ విభాగాన్ని, రాష్ట్ర శాసనసభ కొన్ని ప్రధానమైన సవరణలతో ఆమోదించింది. అక్టోబరు నాటికి ఏర్పడే 'ఆంధ్ర ప్రదేశ్' కొత్త రాష్ట్రమా, లేక, పాత రాష్ట్రమా అనే విషయంలో మొదట కొంత మీమాంస జరిగినా, రాష్ట్ర ముఖ్యమంత్రి, తాము ప్రతిపాదించిన తీర్మానంలోని 'కొత్త' అనే మాటను చివరకు ఉపసంహరించుకోవడంతో ఆ వ్యవహారం ఏ విధమైన చిక్కు లేకుండానే పరిష్కారమైంది. తీర్మానంలో 'కొత్త రాష్ట్రం' అని చేర్చి వున్నట్లయితే, అదొక సమస్యగా పరిణమించి, తెలంగాణాతో పాటు ఆంధ్రలో కూడా తిరిగి ఎన్నికలు జరపవలసిన అవసరమేర్పడేదేమో. అందుచేత కొంతమంది శాసనసభ్యులు ఆందోళన చెందివుండడంలో ఆశ్చర్యం లేదు.

మొత్తంమీద రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుపై ఆంధ్ర శాసనసభ చేసిన సవరణలలో చేసబటు అనదగిన దేమీ లేదు గనుక, అందరూ తప్పక హర్షిస్తారనే భావించవచ్చు. కొత్తగా ఏర్పడే రాష్ట్రానికి 'ఆంధ్ర ప్రదేశ్' అని నామకరణం చేయాలని శాసన సభ నిర్ణయించడం, ఆ పేరుకు తెలంగాణా నాయకులుకూడా తమ సుముఖభావాన్ని వ్యక్తీకరించడం ముఖ్యంగా హర్షించదగిన విషయం. ఈ విషయంలో సంపూర్ణ ఏకీభావం కుదరడం విశాలాంధ్ర భవిష్యత్తుకు శుభ సూచకం.

ప్రభుత్వ కార్యస్థానంతో పాటు హైకోర్టుకూడా ఒకే చోట—రాజధానిలోనే—వుంటే నూతన రాష్ట్రానికి హుందాగా వుంటుందని ఆంధ్ర శాసనసభ తీర్మానం స్పష్టపరుస్తున్నది. తెలంగాణా శాసన సభ్యులు, నాయకులు ఈ అంశంమీద కూడా ఏకీభవిస్తారనే ఆశించవచ్చు.

నూతన రాష్ట్రం ఏర్పాటైన తర్వాత కూడా మన సరిహద్దుల నిర్ధారణ సమస్య ప్రధాన సమస్యగానే వుండే మాట వాస్తవం. కాబట్టి ఈ సమస్యను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించవలసిన బాధ్యత కేంద్ర ప్రభుత్వం మీద వున్నది. ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, మైసూరు, మద్రాసు రాష్ట్రాలతో మన రాష్ట్రానికి వుండవలసిన సరిహద్దులను ప్రత్యేక నిష్పాక్షిక సంఘాల నియామకం ద్వారా భారత ప్రభుత్వం నిర్ధారణ చేయించాలి.

బళ్లారి విషయంలో ఆంధ్రులకు తీరని అన్యాయం జరిగిందనే అంశాన్ని ఎవరూ కాదనలేరు. ఈ ప్రాంతాన్ని ఆంధ్రలో చేర్చడం అవసరమని ఫజలాలీ సంఘం సిఫార్సు చేయడంతో లోగడ జరిగిన అన్యాయం తీరిపోయిందని భావించిన ఆంధ్రులకు కేంద్ర ప్రభుత్వ కొత్త నిర్ణయంవల్ల తీవ్ర ఆశాభంగమే కలిగింది. బళ్లారి వ్యవహారాన్ని సవ్యంగా పరిష్కరించుకునే విషయంలో మన నాయకులు తగినంత దక్షతను ప్రదర్శించలేక పోయినారు. దక్షతను ప్రదర్శించివుంటే ఈ సమస్య ఇంత క్లిష్టంగా పరిణమించివుండేది కాదనే చెప్పాలి.

"రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం సూచించినట్లు బళ్లారి ప్రాంతాన్ని మైసూరునుంచి విడదీసి ఆంధ్ర రాష్ట్రంలో చేర్చే అవసరాన్ని భారత ప్రభుత్వం, పార్లమెంటు మరొకసారి ఆలోచించాలని ఈసభ గట్టిగా కోరుతున్నది," అని తీర్మానంలో సమోదు చేశారు. అయితే, ఇంత మాత్రంచేత కార్యం ఎంతవరకు సానుకూల మవుతుందో చెప్పలేము. ఆంధ్ర తెలంగాణా నాయకులు సమైక్యంగా తీవ్ర కృషిచేస్తేనే తప్ప, ఫలితం వుండకపోవచ్చు. సమైక్య కృషి చేయాలనే సత్సంకల్పం ఉభయత్రా వున్నదనే స్పష్టపడుతున్నది. దీన్ని శుభప్రదమైన విషయంగానే భావిద్దాము.

కొత్తగా ఏర్పడే 'ఆంధ్ర ప్రదేశ్' దాదాపు లక్ష చదరపుమైళ్ల విస్తీర్ణం, మూడు కోట్లకు పైగా జనాభా గల రాష్ట్రం. ఇంత ప్రధానమైన రాష్ట్రంలో ఎగువ శాసనసభ వుండడం అవసరమనే చెప్పాలి. 72 మంది సభ్యులతో నూతన రాష్ట్రానికి ఎగువసభ వుండాలని ఆంధ్ర శాసనసభ తీర్మానించింది. హైదరాబాద్ శాసనసభ కూడా ఇదే కోర్కెను వ్యక్తీకరిస్తున్నది. ఈ ప్రతిపాదనను అంగీకరించి ఎగువసభను ఏర్పాటు చేయడానికి కేంద్ర ప్రభుత్వానికి ఏ అభ్యంతరం వుండకూడదు.

# భూదానం చేయడమంటే దాహం అడిగినవారికి మంచినీళ్లు ఇచ్చినట్లు

అనంతపురం, ఏప్రిల్ 6: ఆచార్య వినోబా భావే రాచపల్లివద్ద ఒక ప్రార్థన సమావేశంలో మాట్లాడుతూ దాహం అడిగిన వారికి మంచినీరు యివ్వడం ఎలా నిరాకరించలేమో ఆ విధంగానే భూమి కావాలని కోరిన వారికి భూదానం చేయకుండా ఉండలేరు అని చెప్పారు. అయితే యీ దానాన్ని స్వీకరించినవారు భూమిలను బీళ్లుగా విడిచి పెట్టగూడదన్నారు.

శ్రీ భావే యింకా యిలా అన్నారు: కుమారుడు తన తండ్రిని ఎలాగారను చేస్తాడో, అదేవిధంగానే భూమిలేని నిరుపేదలు ఆ ప్రాంతీయులతో నివసిస్తూ ఉండటం చేత సంక్రమించిన హక్కుతో తమ భుక్తికోసం ఆ ప్రదేశంలో కొంత నేలను కోరేహక్కు ఉంటుంది.

ప్రభుత్వ పత్రాలలో కనిపించే భూముల యాజమాన్యానికి కాలదోషం పట్టి ప్రస్తుత పరిస్థితులకు ఏవిధమైన సంబంధం లేకుండా పోయింది.

ఏమీ తెలియని కొద్దిపాటి రైతులు స్వల్పవిషయాలమీద ఏవిధంగా దెబ్బలాడుకుంటారో ఆ పద్ధతిలో జాతుల మధ్య పోరాటం సంభవించటం విచారకరం. ప్రజల హృదయాల్లోని మంచితనాన్ని సమీకరించటమే యీ తిగాదాలకు దివ్యౌషధం. ఈ మంచితనం ఏ ఒక ప్రాంతం లేక జాతియొక్క ముల్లేమీ కాదు. ప్రపంచ శాంతికి భంగం కలిగించే ఏ సవాలునయినా ఎదుర్కొటానికి యీ మంచితనాన్ని నిర్మాణాత్మకమయిన చర్యల ద్వారా సమీకరించాలి.

ప్రజలు లోభాలను విడనాడి తమ సద్గుణాలను, శక్తులనూ భూమిని స్వంత ఆస్తిపాస్తులను సంఘానికి సమర్పణచేసుకోవాలి.

## పాక్ ప్రధాని ఆరోపణలు

1 వ పేజి 2వ కాలం తరువాయి

ఉంటే ఇటువంటి ప్రకటనలు చేయటానికి భారత ప్రధాని సాహసించి ఉండేవాడు కాదని అన్నారు. భారత ఆక్రమిత కాశ్మీర్ ప్రజల్లో విప్లవ భావాలను పాకిస్థాన్ కలిగించలేకపోయిందని ఆయన విమర్శించారు. కాశ్మీర్ ప్రజలకు ఆయుధాలకన్నా ముఖ్యంగా కావలసింది విప్లవ భావాలే నని ఆయన ఉద్ఘాటించారు. పాకిస్థాన్ కింద ఉన్న అజాద్ కాశ్మీర్ ప్రజలు పార్లమెంటరీ ప్రభుత్వ వ్యవస్థను కోరుతుండగా, వారికది లభించటం లేదని ఆయన నిందించారు. ఇంకనైనా పాకిస్థాన్ తన విదేశాంగ విధానాన్ని పూర్తిగా మార్చుకోగలదన్న ఆశను వెల్లడించారు.

అవామీలీగ్ సభ్యుడు అబ్దుల్ ఖలీ మాట్లాడుతూ అమెరికా, బ్రిటన్ల తోకపట్టుకొని పాకిస్థాన్ నడుస్తున్నదనీ, ఆ దేశాలు పాకిస్థానకేమీ తోడ్పడక పోగా, పరోక్షంగా భారతదేశానికి తోడ్పడుతున్నవనీ విమర్శించారు. పాకిస్థాన్ ఆహారమంత్రి అబ్దుల్ లతీఫ్ బిశ్వాస్ మాట్లాడుతూ, నెహ్రూ అసలు రంగు-అతడు సామ్రాజ్యవాది అని-బయట పడిందన్నారు.

కాంగ్రెస్ సభ్యుడు డా॥ బసంత కుమారదాస్ మాట్లాడుతూ భారత ప్రధాని మాట మార్చి వేస్తున్నారనీ, కుల మత వివక్షత లేకుండా పాకిస్తానీలంతా నిరసిస్తున్నారనీ అన్నారు.

## అధికారుల ఖండన

అగర్తలా (త్రిపురా), ఏప్రిల్ 6: త్రిపురా, తూర్పుపాకిస్థాన్ సరిహద్దుల దగ్గర భారత సేనలు సమీకరించబడుతున్నట్లు ఢాకా పత్రికలు ప్రకటించిన వార్తలను త్రిపురా ప్రభుత్వం నేడొక ప్రకటనలో ఖండించింది. త్రిపురా సరిహద్దుల్లో ఉన్న ముస్లిములను పాకిస్తాన్ పోవలసిందిగా ఒత్తిడి చేయటం జరుగుతున్నదని ఆ పత్రికలు ప్రకటించిన వార్తలను కూడా త్రిపురా ప్రభుత్వం ఖండించింది.

ఢాకా పత్రికల వార్తలను రేడియో కూడా ప్రచారం చేసింది.

## హైకమిషనర్లతో నెహ్రూ సంప్రదింపులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: కరాచీలో భారత హైకమిషనర్‌గా ఉన్న శ్రీ సి. సి. దేశాయ్ నేడిక్కడ ప్రధాని నెహ్రూను కలుసుకుని ఒక గంటసేపు సంభాషణ జరిపారు. ఆయన రేపు కరాచీ తిరిగి వెళుతున్నారు.

పాకిస్తాన్ హైకమిషనర్ శ్రీ గజన్‌ఫర్ అలీఖాన్ నేడు ప్రధాని నెహ్రూతో అరగంటసేపు సంభాషించారు. ఈయన రేపు పాక్ ప్రధానిని కలుసుకునేందుకు కరాచీ వెడుతున్నారు.

# గుండ్లకమ్మపై వంతెన నిర్మాణం
## ప్రస్తుతం ఆలోచనలేదు

కర్నూలు, ఏప్రిల్ 6: వినుకొండ-కురిచేడు రోడ్డుమీద గుండ్లకమ్మనదిపై వంతెన నిర్మాణం గురించి ప్రస్తుతం ఏమీ ఆలోచించడం లేదని పబ్లిక్ వర్క్సు మంత్రి నేడు శాసనసభలో శ్రీ యలమందారెడ్డికి తెలియజేశారు.

ఒక కానిస్టేబుల్ వుండే పోలీసు చౌకీలను రాష్ట్రంలో ఏర్పాటు చేసే వుద్దేశం ప్రభుత్వానికి లేదని శ్రీ ఎన్. సి. శేషాద్రికి తెలియజేశారు.

పంగంపలస కొండలనుంచి రాయిని వుచితంగా తీసుకు వెళ్లేందుకు (గృహ నిర్మాణానికి) పార్వతీపురం తాలూకా ప్రజలకు అనుమతి యివ్వటం లేదని మంత్రి శ్రీ సంజీవయ్య శ్రీ ఓ. గున్నయ్య ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

చేనేత పరిశ్రమకు సహాయపడేందుకు రాష్ట్ర సహకార ఆర్థిక సహాయ సంస్థను స్థాపించే విషయం ఆలోచనలో వున్నదని శ్రీ ప్రగడ కోటయ్య ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు.

## తెనాలి కళాశాల తాత్కాలిక భవనాలు
### శ్రీ గోగినేని రంగనాయకులచే శంకుస్థాపన

తెనాలి, ఏప్రిల్ 6. అయితానగర్ పశ్చిమ భాగంలో కళాశాల నిర్మాణానికి కొన్న భూమిలో తెనాలి వి. ఎస్. ఆర్. కళాశాల తాత్కాలిక భవనాల నిర్మాణానికి నిన్న సాయంకాలం కళాశాల అధ్యక్షులు శ్రీ గోగినేని రంగనాయకులు చౌదరి శంకుస్థాపన చేశారు. ఈసందర్భంలో కళాశాలసంఘ సభ్యులు తదితర పెద్దలు హాజరైనారు. స్వ. వి.

## ప్రదర్శనశాలకు శ్రీ నెహ్రూ దానాలు

అలహాబాద్, ఏప్రిల్ 6: శ్రీ నెహ్రూ యిక్కడికి వచ్చినప్పుడు అలహాబాద్ ప్రదర్శనశాలకు తమ పూర్వీకులు జాగ్రత్త చేసిన అనేక వస్తువులను దానం చేశారు.

మహాత్మాగాంధీ 1930 ఏప్రిల్ 6 వ తారీఖున దండీలో తయారుచేసిన రెండు ఉప్పు పొట్లాలు గాంధీజీ ఉపయోగించిన ఒక పాత గడియారం శ్రీమతి స్వరూపరాణి నెహ్రూ (శ్రీ నెహ్రూ తల్లి) వ్రాసి ఉంచిన ఒక దిన చర్య పుస్తకం, పండిత మోతీలాల్ నెహ్రూ వాడిన పర్సులు, గుండీలు యీ సంచయంలో ఉన్నాయి. శ్రీ నెహ్రూ చరిత్రను తెలిపే ఒక టిక్కెట్టుకూడా ఇందులో ఉన్నది.

శ్రీ నెహ్రూ తన కుటుంబం సేకరించిన వస్తుసంగ్రహాన్ని అలహాబాద్ ప్రదర్శనశాలలో భద్రపరచాలని వాంఛించారు.

శ్రీ నెహ్రూకు 1922 వ సంవత్సరం మే 19 వ తేదీన 18 మాసాల కారాగారవాస శిక్ష విధించినట్లు ఈ జైలు టిక్కెట్టునుబట్టి తెలుస్తున్నది. లక్నో కారాగారంలో ఉన్నప్పుడు శ్రీ నెహ్రూ ఎంత బరువు తగ్గారో కూడా యిందులో ఉన్నది.

# పుష్కరాలలో సదుపాయాలు
## రాజమండ్రిలో పౌరకృషి

రాజమండ్రి, ఏప్రిల్ 6: ఇంకొక నాలుగునెలలలో లక్షలాది యాత్రికుల నాకర్షించే గోదావరి పుష్కరాలలో యాత్రికుల సౌకర్యార్థం తగు యేర్పాట్లు చేయడానికి ఒక పౌరసంబంధసంఘాన్ని నెలకొల్పేందుకు నిన్న పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ పోతుల వీరభద్రరావు పౌరసభ యేర్పాటు చేశారు.

యాత్రికుల కోసం సౌకర్యాలను పుష్కరసంఘమే చేస్తున్నదనీ, రెండు తరాల పంచాంగకర్తలు వేర్వేరు రోజులలో పుష్కరకాలాలు నిర్ణయించడం సుమారు నెలరోజులపాటు యాత్రికుల రద్దీ హెచ్చుగావుంటుందనీ, ఆ నెల రోజులూ ఆరోగ్యపరిస్థితులు క్రమంగా కాపాడుతూ ఉండేటందుకు పౌరసంబంధసంఘం బాధ్యతతో పనిచేయాలనీ శ్రీ వీరభద్రరావు చెప్పారు.

శ్రీ జి. ఎస్. బాలాజిదాస్ ప్రసంగిస్తూ ఒక్కొక్క టిక్కెట్టు గాలరీవు ప్రాంతీయ పుష్కరస్థలమని భ్రమపడి అధికారులు యేర్పాట్లన్నీ అక్కడ కేంద్రీకరించాలన్న దృష్టిలో వున్నట్లున్నదనీ - యాత్రికులు పట్టణంలోని ప్రతి పేటలోనూ తమ బంధువుల్లో, తెలిసినవారిలో ఉన్నచోట్ల సెల్లమకాములు చేస్తారనీ, అందుచేత అన్ని వార్డులలో తగుయేర్పాట్లు అతిత్వరితంగా చేయాలనీ అన్నారు.

అధికారసంఘ కార్యదర్శి యిటువంటి పౌరసభలకు హాజరై తాము ఏమి చేస్తున్నదీ తెలియపర్చటం ధర్మమనీ పూర్వపురోజులలో కలెక్టర్లు అట్లా చేసేవారని శ్రీ బోడపాటి రామలింగం అన్నారు.

శ్రీ ఉండవల్లి శంకరకోటేశ్వరరావు ఇటువంటి కార్యాలలో భారతసేవక సమాజ్ సహకార ముంటుందని వాగ్దానము చేశారు. శ్రీ దూడ వీరాస్వామిరెడ్డి రాష్ట్రప్రభుత్వం భారత ప్రభుత్వం కూడ ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారనీ లోటు యేమీ వుండదనీ చెప్పారు.

మగవారు తోడు లేకుండా వచ్చిన మహిళా యాత్రికుల కోసం ప్రత్యేకంగా పాకలు వేయిస్తే వాటి నిర్వహణ బాధ్యతను స్థానిక మహిళామండలి తరఫున తాము వహిస్తామని సబ్‌కలెక్టరుతో చెప్పారనీ, తాముకూడా పుష్కరకమిటీలో అనధికారసభ్యులైన ప్పటికీ తమకు ప్రోత్సాహకరమైన జవాబు సబ్‌కలెక్టరువద్దనుంచి రాలేదనీ శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి చెప్పారు.

గోదావరినది ఒడ్డునవున్న ఈ పట్టణంలో ప్రస్తుతమున్న 1,15,000 జనాభాకే నీటిఎద్దడి బాధగా వున్నదనీ, పుష్కరరోజులలో, అధమం రోజుకు రెండు లక్షల ప్రజ అదనంగా వుండటమేగాక తరచుగా దాహంవేసే రోజులు వేసవి అనీ, కనుక మంచినీటి సరఫరా విషయంలోనూ—ఇప్పటికే మితిమీరిన ధరలకు పెరిగిన బియ్యం, కట్టెపుల్లలు విషయంలో చాలామంది ఆందోళనను వెలిబుచ్చారు.

శ్రీ వీరభద్రరావు గత రెండు రోజులుగా ప్రభుత్వ ఆరోగ్యశాఖ యింజనీరు యిక్కడవుండి మంచినీటి సరఫరా విషయంలో సమగ్రంగా చర్చించి, అమూల్యమైన పథకాన్ని యిచ్చారనీ, రు 80 వేలు ఖర్చులో సత్వరంగా ఆ పథకం అమలు జరుపబోతున్నామనీ అందుచేత త్రాగునీటి సప్లయి విషయంలో ఆందోళనా భయమూ అవసరం లేదనీ హామీ యిచ్చారు.

శ్రీ వంకాయల సుబ్బారావు, శ్రీ పెదిరెడ్ల వీరన్న, శ్రీ సుబ్రాల సత్యం, శ్రీ కృష్ణ, శ్రీ మంచిరాజు చంద్రశేఖరం, శ్రీ మల్లెంపూడి అప్పారావు, శ్రీ దాసుర్ల వెంకట్రావు మొదలైనవారు తమతమ సూచనలిచ్చారు. శ్రీ కౌశురి పర్వతాలింగం తాము కార్యదర్శిగావున్న శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘం ఏమి చేయబోతున్నదో వివరించారు.

సభాధ్యక్షుల ప్రతిపాదనపై 20 మంది సభ్యులతో పుష్కర సందర్భంలో పౌర సంబంధాల సంఘము యేర్పాటు జరిగింది (స్వ. వి.)

## తిరుత్తని పంచాయతీ ఎన్నికలు

తిరుత్తని, ఏప్రిల్ 6: ఈ పంచాయతీ సంఘంలోని 10 వార్డులకు 2 వ తేదీన 44 మంది అభ్యర్థి పత్రాలను దాఖలుచేశారు. కొందరు అభ్యర్థులు ఉపసంహరించుకొన్న మీదట 1 వ వార్డులో శ్రీటి వరయ్యప్పది (హరిజన్) 2 వ వార్డులో శ్రీ ఎం. సుబ్రహ్మణ్యం ఏకగ్రీవంగా ఎన్నికైనట్లు నిన్న ఎన్నికల అధికారి ప్రకటించారు. మిగతా 8 వార్డులలో పోటీ ఒ ముమ్మురంగా ఉన్నది. ఈ సారి పంచాయతీబోర్డు ఎన్నికలలో తమిళులకు తెలుగులకు తీవ్రంగా పోటీ చేసికొంటూ వస్తున్నారు. 8 వ వార్డులో నేటి పంచాయతీబోర్డు అధ్యక్ష ఉపాధ్యక్షులు తెలుగువారలు శ్రీయుతులు టి. కేశవనాయ్యార, కె. ఎం. వెంకటేశ మొదలియారు గారలు పోటీపడి తీవ్రంగా ప్రచారాలు సాగిస్తున్నారు. ఎన్నికలు ఈ నెల 16 తేదీ జరగనివి. స్వ. వి.

# మద్యనిషేధాన్ని రద్దు చేయుటం అసంభవం
## ప్రజల అభివృద్ధికి అవసరం అని శ్రీ నందా ప్రకటన

బొంబాయి, ఏప్రిల్ 6: "ప్రజల ఆర్థికాభివృద్ధికి మద్యనిషేధం అత్యవసరం. అందువల్ల దానిని రద్దుచేయుటమన్నది ఎప్పటికీ జరగదు" అని కేంద్ర ప్లానింగ్ మంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా బొంబాయి రాష్ట్ర మద్యనిషేధ వారోత్సవాన్ని ప్రారంభిస్తూ ఉద్ఘాటించారు.

"జీవాభివృద్ధికోసం జీతనుంతటా మద్యనిషేధం అమలుజరగాలి దానిని ప్రవేశపెట్టిన ప్రాంతాలన్నిటిలోనూ, నిరుపేదలైన ప్రజల పరిస్థితి ఆర్థికంగా కొంత బాగుపడ్డది. వారి ఆడవారి, పిల్లల పరిస్థితి మరింత బాగుపడి, వాళ్ళ సంసారాలు చక్కబడినవి. మన దేశంలో పోషకస్తుపద్ధతి సమాజాన్ని స్థాపించ సంకల్పించుకున్నాము. ప్రజల ఆరోగ్యం, సంసారాల్లో సుఖం అనేవి లేనప్పుడు కేవలం డబ్బు ఏంచేస్తుంది? మద్యపానంవల్ల ఆరోగ్యం, సంసారాల్లో సంతోషం అనేవి రెండూ నాశనం కాగలవు." అని ఆయన హెచ్చరికచేశారు.

బొంబాయిలో మద్యనిషేధం చక్కగా సాగుతున్నందుకు అభినందిస్తూ, అది దేశవ్యాప్తంగా ఉంటేనే పూర్తిగా నెగ్గుతుందని హెచ్చరించారు. ప్రజలు సహకరిస్తేనే కాని, మద్యనిషేధ నేరాలు తగ్గవని విన్నవించారు.

బొంబాయి సంక్షేమ మంత్రి శ్రీ మురార్జీ దేశాయ్ మద్యనిషేధం ఎప్పటికీ రద్దుకాదని కేంద్ర మంత్రి ఇచ్చిన హామీకి కృతజ్ఞత తెలిపారు.

ఈ ఉత్సవాలు జయప్రదం కావాలని రాష్ట్రపతి, ప్రధాని, ప్రభుత్వ ఉపాధ్యక్షుడు, రాష్ట్రాల గవర్నర్లు, ముఖ్యమంత్రులదగ్గరనుంచి సందేశాలు వచ్చినవి.

## ఆంధ్ర ప్రభుత్వం నిర్వహించే పరీక్షలు

మదరాసు, ఏప్రిల్ 7: ఆంధ్రప్రభుత్వపు టెక్నికల్ పరీక్షలు విజయనగరంలో సంతపేటలోని బి. పి. యం. యం. హైస్కూలులోను, కర్నూలులో ప్రభుత్వపు ట్రెయినింగ్ కాలేజిలోను ఏప్రిల్ నెలలో జరుగును.

### సంస్కృత ప్రవేశ పరీక్ష

సంస్కృత ప్రవేశపరీక్ష ఏప్రిల్ 22 నుంచి 27 వ తేదీ వరకు జరుగుతుంది. ఈ పరీక్ష వేళల వివరాలను 16-3-56 వ తేదీ ఆంధ్ర గెజెట్‌లో చూడవచ్చును.

### అకౌంటు టెస్టు

స్థానిక సంస్థల ఉద్యోగులకు అకౌంటు టెస్టు ఏప్రిల్ 27, 28 వ తేదీలలో జరుగుతుంది అభ్యర్థుల వివరాలను 28-3-56 వ తేదీ ఆంధ్ర గెజెట్‌లో చూడవచ్చును

# గ్రంథకర్తల హక్కుల సంరక్షణ బిల్లు
## సంస్కృతి అభివృద్ధికి చర్య: డా॥ శ్రీమాలి వివరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: "కాపీరైటును (గ్రంథస్వామ్యం) పార్లమెంటు పరిశీలన నిమిత్తం త్వరలో శ్రీని వేదిస్తారు. పటిష్ఠమయిన గ్రంథస్వామ్య వ్యవస్థను ఏర్పాటు చేయడం మీదనే సారస్వతి, విజ్ఞానిక, కళాసంపద అభివృద్ధి ఆధారపడి వుంటుంది. మానవ ప్రతిభ సృష్టించిన కళాఖండాలు అంతర్జాతీయంగా ప్రచారం కావడం, ఆ ప్రచారంవల్ల అంతర్జాతీయ సామరస్య సౌభ్రాత్రాలు అభివృద్ధి కావడం మొదలయిన సత్ఫలితాలెన్నో యీ గ్రంథస్వామ్య వ్యవస్థవల్ల సుసాధ్యమౌతాయి. ప్రస్తుతపు బిల్లును రూపొందించడంలో వివిధ శాఖలతోను రాష్ట్రప్రభుత్వాలతోనూ, భారతీయ విశ్వవిద్యాలయాలతోనూ సంప్రతించడం జరిగింది" అని విద్యాశాఖ ఉపమంత్రి డా॥ శ్రీమాలీ వ్రాశారు.

ఈ బిల్లులోని ముఖ్యాంశాలు ఇవి: రిజిస్ట్రారు అజమాయిషీ క్రింద ఒక గ్రంథస్వామ్య కార్యాలయం నెలకొల్పుతారు. సమగ్రమైన రిజిస్టరు ఒకటి ఏర్పాటుచేసి గ్రంథస్వామిక హక్కులను నమోదుచేయడం యీ కార్యాలయం నిర్వహించవలసిన ముఖ్యవిధి. కార్యాలయంలో నమోదు చేసిఉంటేనే తప్ప, హక్కుభంగం విషయంలో చట్టరీత్యా ఎట్టిచర్యలు అవలంబించడానికి వీలు ఉండదు.

### ఇతరదేశాల్లో

కొన్ని దేశాలలో గ్రంథస్వామిక హక్కు సంపాదనకు విధిగా లాంఛనాలు అవసరం లేదు. ఫ్రెంచు, బ్రిటనులు ఇందుకు ఉదాహరణలు. బ్రిటనులో స్వచ్ఛందంగా గ్రంథస్వామ్యపు హక్కును నమోదుచేయడం ఉండిగాని దానికి ప్రత్యేకమైన ప్రాముఖ్యం ఏమీ లేదు. అయితే ఫలానా కృతి ఫలానా కర్త చేస్తున్నా సాక్ష్యంమాత్రం దీనివల్ల లభిస్తుంది. అమెరికాలో కొన్ని లాంఛనాలను విధి నిర్వర్తించవలసి ఉంటుంది. యీ నిబంధనలను అనుసరించక పోయినట్లయితే, హక్కు పోవచ్చును.

ఆస్ట్రేలియాలోని చట్టం ప్రకారం, రిజిస్ట్రారు అజమాయిషీ కింద కాపీరైటు కార్యాలయం ఒకటి ఉంటుంది. హక్కును విధిగా నమోదు చేసుకోవాలన్న నిర్బంధం ఏమీ లేదుగాని, కొన్ని ప్రత్యేకమైన చర్యలు తీసుకోవాలంటే ఆ విధంగా నమోదు చేసుకొన్న వారికి మాత్రమే సాధ్యమౌతుంది.

### మధ్యేమార్గం

భారతప్రభుత్వం ప్రస్తుతబిల్లులో అటు అవసరమైన లాంఛనాల గొడవ ఏదీ లేకుండానూ, ఇటు స్వైరవిహారానికి అవకాశం లేకుండానే ఆస్ట్రేలియా పద్ధతిలో మధ్యేమార్గాన్ని అవలంబించింది. హక్కును అసలు నమోదు చేసుకోవడమూ మానడమూ అనేది గ్రంథకర్త తన ఇష్టాన్ని బట్టి నిర్ణయించుకోవచ్చును. కాని తమ హక్కులను ఎవరైనా భంగం కల్గించినప్పుడు చట్టరీత్యా చర్యలు తీసుకోడానికి వీలుండాలంటే ఈ శాసనంకింద నమోదుచేసుకోవడమే మేలు. అలా గ్రంథకర్తలు వీలైనంత వరకు నమోదు చేసుకొనేటట్లు చేయడమే దీనివుద్దేశం కూడా. పోతే యీ బిల్లులోని మరొక క్లాజు ప్రకారం గ్రంథ స్వామ్య సంస్థను ఏర్పాటు చేయవలసివుంది. ఈ సంస్థ రుసుముల ప్రమాణాలను, రాయల్టీల పరిమాణాలను నిర్ణయించడమే కాకుండా బహిరంగ ప్రదర్శనలకు లైసెన్సులు మంజూరుచేయటం, కొన్ని పరిస్థితులలో నష్టపరిహారం ఎంత చెల్లించాలో నిర్ణయించడం మొదలైన పనులు కూడా చేస్తుంది. న్యాయసమ్మతమైన హక్కులను సంరక్షించి అన్యోన్య పేచీలకు అవకాశం లేకుండా చేస్తుంది. సారస్వతం, కళ, చలనచిత్రపరిశ్రమ, యంత్ర పరికరాలను ఉత్పత్తిచేసేపరిశ్రమలు, వాటిల్లో కనీసం ప్రత్యేకంగా నిపుణులైన వ్యక్తులు కనీసం ఇద్దరు ఈ సంస్థలో సభ్యత్వం వహిస్తారు.

### 25 ఏళ్ల వరకూ హక్కు

గ్రంథ స్వామ్యపు హక్కు కాల పరిమితిని తగ్గించడమనేది యీ బిల్లు ద్వారా తేబ్బిన మరొక ముఖ్యమైన మార్పు. పూర్వం గ్రంథకర్త మరణించిన తర్వాత 50 ఏళ్లవరకూ కూడా హక్కు ఉండేది. ఇప్పుడా పరిమితి గ్రంథకర్త మరణానంతరం 25 ఏళ్లకు తగ్గించారు. హక్కు పరిసమాప్తం కాగానే సహజంగా గ్రంథాలపై సర్వహక్కులు ప్రజల హస్తగతమౌతాయి.

సారస్వత వైభవం, సంగీత చిత్ర కళా శాస్త్రాల తమ ప్రతిభను ధారపోసి సృష్టించే కళాఖండాలను ఇతరులు చౌర్యం చేయకుండా కాపాడడమే యీ హక్కు ముఖ్యోద్దేశం. వారికి జీవనోపాధి కల్పించే వారికృతులను సంరక్షించడం సమాజంయొక్క విద్యుక్తధర్మం. అంతే కాకుండా కళాకారులు మరణించిన తర్వాత అనాథులైన వారి కుటుంబాలకు సంరక్షణం కూడా సమాజం నిర్వహించవలసిన విధి. స్వోదర పోషణం కోసం గాని, తమ కుటుంబపోషణార్థం గాని తిప్పలు పడవలసిన అవసరం లేకుండా కళాకారులు ఏకాగ్రచిత్తంతో తమ అభిమాన విషయంలో కృషి చేయగలగాలి.

అయితే గ్రంథ స్వామ్యపు హక్కు గడువును గ్రంథకర్త మరణించిన తర్వాత 25 ఏళ్లకు ఎందుకు పరిమితం చేయవలసి వచ్చిందని ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమిటంటే, గ్రంథకర్తకు గ్రంథకర్త కుటుంబానికి సర్వసామ్యాలను ధారాదత్తం చేయాలన్న ఆకాంక్ష కు గురిఅయి, అసలు ఈహక్కు లక్ష్యాలను తాడివిట్లో విస్మరించకూడదు. 25 ఏళ్లలోగా ఆయన సంతతికి తమ రెక్కల మీద తాము జీవించే విస్తలుబాటు కలుగుతుంది. కాబట్టి తర్వాతకూడా ఆ హక్కు గ్రంథకర్త కుటుంబపరంగానే ఉండడం అవసరం అదీగాక తరుచుగా యీ హక్కు గ్రంథకర్త పేరిట కాక, ప్రకాశకుల పేరిటనపోను అయి ఉంటుంది. అందువల్ల ఆదాయంలో అధిక భాగం ప్రకాశకుడే చేజిక్కించుకుంటాడు. ప్రకాశకుడు గ్రంథాలను ఎంతకాలం విక్రయిస్తుంటే, అంతకాలం గ్రంథకర్తకు వరుమానాన్ని చెల్లిస్తూనే ఉంటాడు. గ్రంథకర్త వారికుటుంబాల, ప్రకాశకుల హక్కులతో పాటు పాఠకుల హక్కులను కూడా ప్రభుత్వం గమనించవలసి ఉంది.

### సమాజశ్రేయస్సు

సమాజ శ్రేయస్సు దృష్ట్యా, సాంస్కృతికాభివృద్ధి దృష్ట్యా, బిల్లులో కర్తల హక్కులపై కొన్ని నియమాలు విధించారు. ప్రజలకు ప్రదర్శించదగిన కృతిని తిరిగి ప్రదర్శించడానికి లేదా పునర్ముద్రించడానికి యీ బిల్లు క్రింద లైసెన్సు జారీచేయవచ్చును. బజారులో లభ్యంకాని 'గ్రంథస్వామ్యపు హక్కుగల' పుస్తకాల ప్రతులను ముద్రించడానికి ప్రజాహిత గ్రంథాలయాలకు లైసెన్సులు మంజూరు చేయవచ్చును. గ్రంథస్వామ్యపు హక్కు అనేది పరిమితిలేని సర్వసామ్యం కాదు. కళాకారులకూడా సంఘంలో జీవించవలసిన వారే కనుక సమాజంపట్ల వారు కొన్ని బాధ్యతలను నిర్వహించవలసి ఉంటుంది.

గ్రంథకర్తలు మామూలుగా బేరసారాలు ఎరిగినవారు కారు గనుక, వ్యాపారస్తుల వలలో చిక్కకుండా వారిని కాపాడటం అవసరం. అవసర సమయాలలో అల్పమొత్తాలకు తమ గ్రంథాలను ప్రకాశకులకు అమ్మివేయుడంకద్దు. అట్లా ఒకవేళ పొరపాటున యిచ్చేస్తే, మళ్ళీ ఆ హక్కును సంపాదించడానికి గ్రంథకర్తకు యీ బిల్లు అవకాశం కల్పిస్తున్నది. హక్కును విక్రయించినతర్వాత పదు ఏళ్లు మొదలు 10 ఏళ్ళలోపల గ్రంథకర్త కావాలనుకుంటే, ఆ హక్కును తిరిగి సంపాదించవచ్చును. 'ప్రకాశకుడు గ్రంథ విక్రయంకోసం ఎంతో కష్టపడి బోలెడు డబ్బు ఖర్చుచేసి ప్రచారం సాగిస్తాడు గదా? ఇంతాచేసి ఏడుఏళ్ల అనంతరం గ్రంథస్వామ్యపు హక్కు ఉన్నట్టుండి యింకొకరి చేతిలోకి పోతే ఎలాగ?' అని కొందరు ప్రశ్నించవచ్చు. దీనికిజవాబు ఏమిటంటే, పుస్తకంమీద మొదటి ఏడుఏళ్లలోగానే ప్రకాశకులు కావలసిన సొమ్ము చేసుకోవచ్చును. గ్రంథకర్తకు తీవ్రమైన అన్యాయం జరిగితే నే తప్ప మామూలుగా ఏడుఏళ్ల అనంతరం ఆ హక్కును తిరిగి సంపాదించుకోవాలని ప్రయత్నించరు. అట్టి పరిస్థితుల్లో ప్రకాశకులు యీ సరతును గురించి ఆందోళన చెందడం అనవసరం. పోతే అనువాదపు హక్కుల విషయంలో కూడా కొంత మార్పుచేశాము. శాసనం ప్రకారం భారతదేశంలో ప్రచురించిన ఏ కృతికి గాని 10 ఏళ్ళలోపల అనువాదం వెలువడక పోయినట్లయితే, ఇక ఆ హక్కు అంతటితో సమాప్తం అవుతుంది. కాని కొత్తబిల్లుప్రకారం యీ హక్కు యితర హక్కులు ఎంతకాలం అమలులోవుంటే అంతకాలమూ అమలులో ఉంటుంది.

ఈ బిల్లుప్రకారం విదేశీ కృతులకు కూడా అన్యోన్య పద్ధతిపై గ్రంథస్వామ్యపు హక్కును విస్తరింపజేసే అధికారం కేంద్ర ప్రభుత్వానికి ఉంటుంది.

కథ, సంగీతం, ఫోటోగ్రాఫులు, మొదలైన అంశాలతోపాటు ప్రత్యేకంగా చలనచిత్రాలకుకూడా ఈ హక్కు ఏర్పాటుచేయడానికి అవకాశం కల్పించారు. ఆకాశవాణి రచనల విషయంలో కూడా ఇదే పద్ధతి అవలంబించాము. ప్రస్తుతపు బిల్లులో అన్నివర్గాలహక్కులను సమన్వయపరచి, వీలైనంతవరకూ, మధ్యేమార్గాన్ని అనుసరించడానికి ప్రయత్నించడం జరిగింది.

భద్రాచలం, ఏప్రిల్ 5: చోడవరం శివారు యర్రగుంట గ్రామసమీపంలో చాలా కాలంగా పశువులను పొట్టబెట్టుకొంటున్న ఒకపులిని అగ్రామ పశువులకాపరిగా [illegible] పంపారు. దీని పొడవు 9 అడుగుల 6 అంగుళాలు. పులి బాధ తప్పినందుకు ఆ ప్రాంత రైతులు సంతోషిస్తున్నారు.

## సంపాదకునకు లేఖ
### గుంటూరుపట్టణము రోడ్లపై పరిస్థితి

అయ్యా, గుంటూరులో శాఖా రద్దీ గలమార్గములు సుమారు పది అయి నా ఉన్నవి. అందులో ముఖ్యముగా 1. తాలూకా ఆఫీసునుండి రైలుగేటు మీదుగా, ఏ. సి. కాలేజి, హిందూ కాలేజి, మ్యునిసిపలుఆఫీసు, పాతీసు స్టేషనుమీదుగా బియ్యపుఫ్యాక్టరీలకు, అపైన సంగడిగుంటగోడ్డును 2. రైల్వే బ్రాడీ గేజి సుబ్బాపెడ్ రోడ్డుమీదుగా అనేకవ ర్తక, వ్యాపారసంస్థలు, సినిమా హాలులు, మ్యునిషిపలు రైల్వే కీమీదుగా బియ్యపు ఫ్యాక్టరీలకు, అపైన సంగడిగుంటకు వెళ్లేరోడ్డును, 3. మంగళగిరి, పొన్నూరు గుంటూరు కలిసే స్థలంనుంచిబస్సు స్టాండుమీదుగా, మ్యునిసిపల్ హైస్కూలు మీదుగా ఫ్యాక్టరీలకు వెళ్లేరోడ్డును, 4. పట్నంబజారు, బండల బజారు నుండి పెలకం హోటలుమీదుగా అగ్రహారం వెళ్లేరోడ్డును విపరీతమైన రద్దీ కలిగివున్నవి ఈరోడ్లు రాత్రిపూట ఏవేళ్లా వీలుగ కంటలలోతప్ప, మిగతా సమయము లలో రాకపోకలు విపరీతముగానున్నవి. ఈరోడ్లమీద అనేక ప్రమాదములు కూడా జరుగుచున్నవి.

1. లైసెన్సులేని డ్రైవర్లు, కొందరు యజమానులు, యజమానుల కుమారులు గాని బంధువులుగాని చిన్నకార్లు నడపడం 2. లైసెన్సువున్న డ్రైవర్లు కొందరు, ఎక్కువమంది విపరీతమైన వేగముగా నడిపడంవలనను, 3. గ్రామాలనుండి వర్తక - వ్యాపారనిమిత్తం వచ్చే బండ్లు, పుగాకు, వేరుసెనగ, మిరపకాయలు, పత్తి మొదలుగునవి తెచ్చే బండ్లు రోడ్డ్లప్రక్కనే ఎక్కడబడితే అక్కడ నిలబడిఉండడం 4. కొందరు రిక్షాబండ్లవాళ్లను, గ్రామప్రాంతముల నుంచి వచ్చే అమాయక ప్రజలను నిబంధనలు తెలియక గాభరాపడడం 5. లాగుడుబండ్లవాండ్లు రద్దీ పెరగడమే గాక, వారుపోయే విపరీతమైన పురవడి వలనను అనేక ప్రమాదములు జరుగుచున్నవి.

పట్నంబజారు, బండల బజారు అగ్రహారం రోడ్డులమీద లారీలు, ఎడ్లబండ్లు, లాగుడుబండ్లు గంటలపర్యంతం నిలబడుటవలన, కనీసము వీధిమనుష్యులు నడచుటకైనను స్థలము లేకపోవుటయే గాక, అనేక ప్రమాదములు కూడ జరుగుచున్నవి. ఇది కొత్తపేటలో[illegible] పోలీసు నిత్యము అనేకచోట్ల చాలా ప్రమాదములు జరుగుచున్నవి. కనుక ఈ సందర్భములో పోలీసువారి బాధ్యత హెచ్చుగా ఉన్నప్పటికిని, ఏమంత శ్రద్ధతీసుకొంటున్నట్లు కన్పడదు. అందువలన ప్రజాక్షేమమును దృష్టిలోపెట్టుకొని, ప్రమాదములు సంభవించకుండగ నిబంధనలు అమలుజరుపగలరని గట్టిగా ఆశించుచున్నాను.

ప్రజలందరు పేవ్‌మెంటుమీద (అనగా ప్రజలకు నిర్మించిన కాలిబాటలు) విధిగా నడచేటట్లు చేయడము అవసరము.

పేవ్‌మెంట్లమీద, ఎక్కువగా, పోడాబస్సు, కిళ్లీకొట్లు, గుడ్డి, కుంటి మొదలకు యాచించేవారు, పనిపాటలేని బాతాఖానీ మనుష్యులు ఉంటున్నారు. ఇంకా సైకిళ్ళు, కాఫీహోటలు బెంచీలు, కిళ్లీకొట్ల బెంచీలు అక్కడక్కడ కనబడుచున్నవి. ఇట్లా ఉండుటవలన జనం స్వేచ్ఛగా, త్వరగా నడచుటకు వీలులేక రోడ్డుమీద నడచుచున్నారు. కనుక అటువంటివేమి నిలబడకుండ, పేవ్‌మెంటు కేవలము ప్రజలబాటల క్రిందనే ఉపయోగపడేటట్లు చూడాలి.

పట్నంబజారు, బండలబజారుల విషయములో ప్రత్యేకశ్రద్ధ అవసరం. యిక్కడ పరిస్థితులు మరీ ఘోరం. రోడ్లు ఎంత విస్తృతంగా వెడల్పుగలవో అంత రద్దీ ఎక్కువ. విపరీతముగా, లారీలు, రెండెడ్లబండ్లు గంటలతరబడి నిలబడకుండునట్లు చూడవలసినది ప్రధానమైన విషయం.

లాగుడు బండ్లవారు విపరీతమైన వేగముతో పోవుచున్నారు. వారివల్ల ఇటీవల దారుణమైన ప్రమాదములు జరిగిన సంగతి ఎల్లరకు విదితమే. కనుకలాగుడు బండ్లవారి వేగాన్ని కఠినంగా తగ్గించి వేయాలి.

రిక్షాలు అనుదినము అనేకములు పెరిగి పోవుచున్నవి. రిక్షా లాగేవారికి నిబంధనలు తెలియవు.

రోడ్లప్రక్కన ఎక్కడబడితే అక్కడ చిన్న కొట్లనుగాని, లారీలనుగాని, బస్సులనుగాని, రిక్షాలనుగాని, గుర్రపుబండ్లనుగాని, ఎద్దుల బండ్లనుగాని నిలబడకుండగ చేయాలి.

ట్రాఫిక్ నిబంధనలను నిత్యము కనీసము 4 గంటలయినా పట్టణ, పరిసర ప్రాంతాలనుండి వచ్చేవారికి తెలిసేటట్లు చెప్పవలెను. ఏ మంత్రిగారో వచ్చినప్పుడు మాత్రము సందుచేసుండా అరుస్తారు. దానివల్ల ప్రయోజనము లేదు. నిత్యము 3, 4 గంటలయినా పరిప్రజలకు విధిగా ట్రాఫిక్ నిబంధనలను తెలియచేయాలి అది పోలీసువారి పూర్తి బాధ్యత అయియున్నది.

గుంటూరు, సి. ఎస్. రావు శర్మ.

## రాజస్తాన్ రాజధాని

అజ్మీర్, ఏప్రిల్ 6: రాజస్తాన్ రాజధానిగా అజ్మీరునే నిర్ణయించాలని రాష్ట్రశాసనసభలోని పేరు కాంగ్రెసు ప్రతిపక్ష సభ్యులు చాలామంది సూచించారు. ముఖ్యమంత్రి ప్రతిపాదించిన రాష్ట్రాల బిల్లుపై చర్చసందర్భంలో వీరు యీ సూచన చేశారు.

# నంద్యాల మైదుకూరు రైలుమార్గం

## చాగలమర్రి మీదుగా అని సిఫార్సు

చాగలమర్రి, ఏప్రిల్ 2 నంద్యాల-మైదుకూరు రైలు మార్గం ఆళ్ళగడ్డ, చాగలమర్రి మీదుగా వేయించమని ఆంధ్రప్రభుత్వం సిఫార్సు చేసిందని గతనెల 31న ఆళ్ళగడ్డలో విద్యుచ్ఛక్తి దీపాలకు ప్రారంభోత్సవం చేస్తూ నీటిపారుదల మంత్రి శ్రీ గౌతు లచ్చన్న చెప్పారు.

శ్రీమతి నీ కొండ రామారావు, శ్రీమతి యశోదా రెడ్డి, శాసనసభ సభ్యులు శ్రీ పి. టి. తిమ్మారెడ్డి, రామప్ప గారలు కూడా మంత్రివెంట ఆళ్లగడ్డకు వచ్చారు.

ఆళ్లగడ్డ పంచాయతీ అధ్యక్షుడు శ్రీ పోచుల వెంకటసుబ్బారెడ్డి, జిల్లా వెనుకబడిన జాతుల సంఘం అధ్యక్షుడు శ్రీ కె. రామకృష్ణ, శ్రీయుతులు లాల్ అహమ్మద్, శైవ వెంకన్న, ఎల్. వి. సుబ్బారెడ్డి, డా॥ పి. పుల్లారెడ్డి, డిప్యూటీ కలెక్టర్ శ్రీ హమీద్ సాహెబ్, సూపరింటెండింగ్ ఇంజనీర్ శ్రీ ఒ. తిమ్మయ్య తదితరులు మంత్రికి స్వాగతం చెప్పారు.

నిర్మాణంలో వున్న ఆదర్శ గ్రామం "సుల్తానా రెడ్డి పేదనగర్" చూడడానికి మంత్రి వెళ్లగా శ్రీ యుతులు వెంగలరెడ్డి, వెంకటాద్రిగారలు స్వాగతం చెప్పారు.

ఆళ్లగడ్డలో విద్యుచ్ఛక్తి దీపాల ప్రారంభోత్సవం తరువాత జరిగినసభకు శ్రీ పి. టి. తిమ్మారెడ్డి అధ్యక్షత వహించారు. పంచాయతీబోర్డు తరఫున శ్రీ కోటిరెడ్డి, స్థానిక వెనుకబడిన జాతుల సంఘం, హరిజనులు, తాలూకా కాంగ్రెసు, చేనేత పారిశ్రామికులు మంత్రికి స్వాగత విజ్ఞాపనలు సమర్పించారు.

రాష్ట్రంలో అమలు జరుగనున్న విద్యుచ్ఛక్తి సప్లయి పథకాలను సూపరింటెండింగ్ ఇంజనీర్ శ్రీ ఒ. తిమ్మయ్య వివరించారు. కర్నూలు జిల్లాలో విద్యుచ్ఛక్తి సప్లయి సౌకర్యాలను చెప్పి ఇంజనీర్ ఇట్లా అన్నారు: "విద్యుచ్ఛక్తి కావాలని గ్రామాలలోని ప్రజలు మొదట అడుగుతారు. కాని, తీరా విద్యుచ్ఛక్తి సప్లయి అయ్యేప్పటికి బాగా సహకరించలేకపోతున్నారు. ఈ గ్రామంలో 8 జిన్నింగ్ మిల్లులున్నవి. విద్యుచ్ఛక్తి తీసుకుంటామని మొదట్లో వాగ్దానంచేసి ఖర్చు ఎక్కువ అని ఇప్పుడు చాలించుకున్నారు. కొన్ని రూపాయల వడ్డీతో ప్రభుత్వం విద్యుచ్ఛక్తి సప్లయి చేస్తే ప్రజలు తీసుకోకుంటే ఇతర గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం ఏర్పాటు చెయ్యడం ఎట్లా సాధ్యమవుతుంది."

ఆ తరువాత మంత్రి మాట్లాడుతూ ప్రత్యేకరాష్ట్రం ఏర్పడిన తరువాత జరిగిన విద్యుచ్ఛక్తి సౌకర్యాలను వివరించారు. ఇకముందు అమలు జరగనున్న విద్యుచ్ఛక్తి సప్లయి పథకాలను విపులీకరించి కర్నూలు జిల్లాలో 27 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయడానికి రు 91 లక్షలు అయిందన్నారు. విద్యుచ్ఛక్తి ఉపయోగాలను చెప్పి ఇట్లా అన్నారు: "కేంద్రప్రభుత్వంవద్ద అప్పు తెచ్చుకొని మనం అభివృద్ధిపనులు చేసుకుంటున్నాం. ఈ అప్పుకు వడ్డీగా 1953-54 లో రు 90 లక్షలు, 1954-55 లో రు 180 లక్షలు, రు 1955-56 లో రు 170 లక్షలు చెల్లించామని గమనించాలి. వీటన్నింటిని బట్టి ప్రజలు సహకరిస్తేగాని ఎర్వాభివృద్ధి సాధ్యంకాదని విశదమవుతుంది."

"నంద్యాల-మైదుకూరు రైలుమార్గం ఆళ్లగడ్డ, చాగలమర్రిమీదుగా వెయ్యాలని ఆంధ్రప్రభుత్వం సిఫార్సు చేసింది. ఈ విషయమై మీకు ఇక ఆందోళన అనవసరం. ప్రస్తుతం మీ గ్రామంలో గూడు దీపాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేస్తున్నారు. మీరు అనుకున్న 75 దీపాలకు కూడా ఇంజనీర్ త్వరలో నే అనుమతి ఇస్తారు." డా॥ పి. పుల్లారెడ్డి వందన సమర్పణ చేశారు.

ఆటు తరువాత కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో మంత్రి ప్రసంగించారు. రెండవ పంచవర్ష ప్రణాళికా పనులలో సహకరించమని ప్రజలకు మంత్రి విజ్ఞప్తి చేశారు.

## పెనుగంచి ప్రోలు హైస్కూలు భవనం

నందిగామ, ఏప్రిల్ 3: ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి నిన్న విజయవాడ వచ్చినప్పుడు పెనుగంచి ప్రోలు కాకాని వెంకటరత్నం బోర్డు హైస్కూలు భవననిర్మాణం రెండు వేళ్ళ క్రితం ప్రారంభమైనా గోడల వరకు పనిజరిగి ఆగిపోయిందనీ విద్యార్థులు సుమారు 300 మంది పందిళ్లలో, చెట్లకింద అగత్యస్థితిలో విద్య నేర్చుకుంటున్నారని వెంటనే ఆ భవనాన్ని పూర్తి చేయించాలని శ్రీ తపాల బుచ్చిరామయ్య శ్రేష్ఠి, శ్రీ సూరిసెట్టి రామయ్య ముఖ్యమంత్రికి విజ్ఞాపన సమర్పించారు.

## యలమంచిలిలో మొబైల్ మేజిస్ట్రేటు కోర్టు

యలమంచిలి, ఏప్రిల్ 1: ఈ గ్రామంలో సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటు కోర్టు ఏప్రిల్ 1వ తేదీ నుంచి ఎత్తివేసి దానిస్థానే మొబైల్ సెకండ్‌క్లాస్ కోర్టును నెలకొల్పారు. సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటు, స్థానిక జిల్లా మున్సబును పని వప్పగించారు.

నూరేళ్ళ చరిత్ర:

# దేశంలో కంపెనీల చట్టం నిర్వహణ

కంపెనీల నిర్వహణశాఖ పరిశోధనాధికారి

[డా॥ తాజ్. కె. నిగమ్]

భారతదేశంలో జాయింటు స్టాకు లిమిటెడ్ కంపెనీల తలిపుట్టుకోర్పు వాలు కొద్ది సెలలలో రానున్నాయి. ఇంగ్లండులోని జాయింటుస్టాక్ కంపెనీలు యిరవైవ శతాబ్దిలో పాలు జరుపుకొన్నాయి. (గ్లాడ్‌స్టన్ అనే ఆయన ప్రవేశపెట్టారు). 1857 వ సంవత్సరంలో ఆమోదించిన కంపెనీల శాసనం ద్వారా భారత దేశంలోని కంపెనీలకు లిమిటెడ్ అనే పదం సంక్రమించింది. భారతదేశ ఆర్థిక పురోభివృద్ధికీ, పారిశ్రామిక పురోభివృద్ధికీ జాయింటు స్టాక్ కంపెనీలను ఆ శాసనం సాధనంగా చేసింది.

జాయింటు స్టాకు కంపెనీల శతవార్షికోత్సవం, భారతదేశ కంపెనీల చరిత్రలో నూతనాధ్యాయం యించుమించుగా ఒకేసారి వస్తున్నాయి. ఈ సంవత్సరం ఏప్రిల్ ఒకటవ తేదీ నుంచి అమలులోకి వచ్చిన క్రొత్త కంపెనీల శాసనం కంపెనీలపైన, వాటి స్థాపకులపైన, నిర్వాహకులపైన క్రొత్త బాధ్యతలను వేస్తున్నది. భారతదేశ లక్ష్యమైన సోషలిస్టు సాంఘిక వ్యవస్థా నిర్మాణం, అభివృద్ధి ప్రణాళికలను, మొదలైనవాటి దృష్ట్యా క్రొత్తమార్పులతో ఆశాసనం రూపొందించబడింది. ప్రయివేటు రంగానికి పట్టుకొమ్మలైన ఈ కంపెనీల పాలిట ఈ శాసనం కల్పవృక్షమని చెప్పాలి.

ద్వితీయ ప్రపంచ యుద్ధం తర్వాత ఏర్పడిన క్రొత్త పరిణామాలు, కంపెనీ శాసనంలోని లోటుపాట్లు, సాంఘిక ఆర్థిక లక్ష్యాలలో మార్పులు, 1947 లో భారత దేశంలో ఏర్పడిన రాజకీయ మార్పులు యిక్కడ తిరిగి చెప్పక్కరలేదు. గత పది, పదిహేను సంవత్సరాలలోను జరిగిన సంఘటనలు వచ్చిన మార్పులు కారణంగా కంపెనీల శాసనాన్ని పూర్తిగా మార్పు చేయవలసిన అవసరం ఏర్పడింది. కాని ఫలితంగానే 1956 వ సంవత్సరపు కంపెనీల శాసనం అమలులోకి వచ్చింది.

## శాసనం లక్ష్యాలు

1956 వ సంవత్సరపు క్రొత్త కంపెనీల శాసనం క్రింద భారత దేశంలోని 30,000 కంపెనీలు (10 వేలు పబ్లిక్ కంపెనీలు, 20,000 ప్రయివేటు కంపెనీలు) పనిచేస్తాయి. పాత కంపెనీల శాసనాలు 1913-1936 వ సంవత్సరాల నాటి శాసనం క్రింద 2,500 పబ్లిక్ కంపెనీలు, 10,500 ప్రయివేటు కంపెనీలు పని చేసేవి.

జాయింటు స్టాకు కంపెనీలలో-జమ అయినమూలధనం విపరీతంగా పెరగడం వల్ల ఈ క్రొత్త శాసనం ద్వారా సుమారు 1,000 కోట్ల రూపాయల వాటాదార్ల మూలధనానికి రక్షణ కల్పించవలసి వున్నది. 1913 శాసనం 70 కోట్ల రూ 1936 శాసనం 300 కోట్ల రూ. లకు రక్షణ కల్పించింది. పెద్ద అయ్యే కంపెనీలు, లిక్విడేటు అయ్యే కంపెనీలు సాలీనా 1,000 దాకా వుంటాయి. ఈ క్రొత్త శాసనం ఆ వ్యవహారాలను కూడా నిర్వహించవలసి వుంటుంది.

ఇకపోతే మేనేజింగ్ ఏజెంట్ల విషయంలో ఈ క్రొత్త శాసనం సుమారు 3,000 మంది మేనేజింగ్ ఏజెంట్లకు సంబంధించిన నియామకం, నిబంధనలు మొదలైన వాటని చూడవలసివుంది. మేనేజింగ్ ఏజెంట్ల క్రింద సుమారు 4000 జాయింటు స్టాకు కంపెనీలున్నాయి.

మేనేజింగ్ ఏజెంట్లు క్రింద వుంటే కంపెనీల మూలధనం 480 కోట్ల రూపాయలు వుంటుందని అంచనా. వీటికి తోడు ఒక కోటి రూపాయలకు పైగా మూలధనం గల 120 పెద్ద కంపెనీల నిర్వహణను కూడ ఈ శాసనం చూడవల్సి వుంది. ఈ పెద్ద కంపెనీల మొత్తం మూలధనం 800 కోట రూపాయలు. పైన పేర్కొన్న వివరాలన్నీ ఈ క్రొత్త శాసన నిర్వహించే సంస్థల బాధ్యతలను వివరిస్తున్నాయి.

## బ్రిటనులో తొలి చిక్కులు

భారత దేశంలోని జాయింటు స్టాకు కంపెనీలచరిత్ర బ్రిటనులోని జాయింటు స్టాకు కంపెనీల చరిత్ర పై ఆధారపడి వున్నది. భారత దేశంలో కంపెనీల శాసనం అమలులోకి రాకపూర్వమే, కంపెనీల శాసన ప్రధాన సూత్రాలను బ్రిటనులో పరీక్షించడం జరిగింది. ఇంగ్లండులో వ్యాపారాలకు "లిమిటెడ్" అనే పదాన్ని చేర్చడానికి మొదట్లో వర్తక వాణిజ్యవర్గాలు తీవ్ర ప్రాతినిధ్యాన్ని వ్యతిరేకించాయి. ఆ సౌకర్యం కొన్ని ప్రత్యేక కంపెనీలకు మాత్రమే వర్తింపజేశారు. కాని 1855 సంవత్సరంలో లార్డు పామర్‌స్టన్ ప్రభుత్వం ప్రముఖ న్యాయశాస్త్రవేత్తలైన జస్టిస్, జాన్ స్టూఅర్ట్ మిల్ గ్లాడ్‌స్టన్, రాబర్ట్ లోయి, లార్డ్ సభ్యుల సలహాదారుల తోడ్పాటుతో (లిమిటెడ్ లయబిలిటీ) పరిమిత బాధ్యత కంపెనీలు ఏర్పాటు చేయవల్సిన శాసనం మంజూరుచేసింది. 1855 వ సంవత్సరంలో ఇంగ్లండులో జరిగిన ఈ మార్పు ఫలితంగా కంపెనీల యాజమాన్యం నిర్వహణ వేరుచేయబడినవి. అంతకుముందు ఇంగ్లండులో సాలీనా 25 క్రొత్త కంపెనీలు నెలకొల్పేవారు. 1855 తర్వాత సాలీనా 120 క్రొత్త కంపెనీలు నెలకొల్పడం జరిగింది. ఆ తర్వాత 8 సంవత్సరాలలో సగటున క్రొత్త కంపెనీలసంఖ్య సాలీనా 700 కు, 1880 నాటికి 1600 కు పెరిగింది.

## 1857-1900 ల మధ్య

గతశతాబ్దం చివరిభాగంలో క్రొత్తగా నెలకొల్పబడిన 3000 కంపెనీలు అనేక కష్టనష్టాలను ఎదుర్కొంటూ ముందుకు వస్తున్నాయి 1857 తర్వాత 20 సంవత్సరాలలో .60 కంపెనీలు ఏర్పడినవి. అవి ముఖ్యంగా తేయాకు, బొగ్గుగనులు జనుము, ప్రత్తి కంపెనీలు. 19 వ శతాబ్దంలోని చివరి మూడుదశాబ్దాలలోను వరుసగా 53,90,135 క్రొత్తకంపెనీలు నెలకొల్పబడ్డాయి. ఆకంపెనీల వాటాదార్ల సంఖ్య అనేక వేలలో వుండేది. పెద్దకంపెనీల వాటాదార్ల సంఖ్య మరింత పెరిగింది.

1900 వ సంవత్సరంలో దేశంలో పని చేస్తున్న కంపెనీల సంఖ్య 1340. వాటి చెల్లించిన మూలధనం 34.7 కోట్ల రూపాయలు.

1857 లో చరిత్రాత్మకమైన కంపెనీల శాసనం అమలులోకి వచ్చిన అనంతరం 50 సంవత్సరాలలో కంపెనీల సంఖ్య, పెట్టుబడుల మొత్తం బాగా పెరిగింది. 1914 వ సంవత్సరంనాటికి కంపెనీలసంఖ్య 2744. చెల్లించబడిన మూలధనం 77 కోట్లు అయింది.

1908-1909 వ సంవత్సరంలోని స్వదేశీ ఉద్యమం దేశంలో పరిశ్రమల అభివృద్ధికి దోహదం చేసింది. మొదటి ప్రపంచయుద్ధం సమయంలోని పరిస్థితుల కారణంగాను, ఆ తర్వాత దిగుమతుల కొరతవల్ల దేశంలోని కంపెనీలు విపరీతంగా పెంపొందాయి. 1914-1922 సంవత్సరాల మధ్య క్రొత్తగా 2448 కంపెనీలు నెలకొల్పబడ్డాయి. 1939 నాటికి కంపెనీల సంఖ్య 11,114 మూలధనం 290.4 కోట్లు, 1937 లో బర్మా భారత దేశంనుంచి వేరుకాగానే, సుమారు 270 కంపెనీలు 25.7 కోట్ల మూలధనంతో బర్మాకు వెళ్లిపోయాయి.

## క్రొత్త మార్పులు

రసాయనికాలు, ఇంజనీరింగు, పెంకి, ధాన్యపువరుల పరిశ్రమలు అభివృద్ధి అయినవి. ప్రపంచ యుద్ధంవల్ల ఏర్పడిన పదార్థాల కొరత అధికంగా వుండడంవల్ల, మొదటిసారిగా ఆర్థికాభివృద్ధికి భారతదేశంలో పరిశ్రమలు క్రమక్రమంగా పెరగసాగాయి. యుద్ధ సమయంలో 7,400 క్రొత్త కంపెనీలు నెలకొల్పబడ్డాయి. హైడ్రోజనేటెడ్ నూనె, విద్యుచ్ఛక్తి పరికరాలు రవాణా సామగ్రి, యంత్రపు పనిముట్లు, రసాయనిక వస్తువులు, ప్లాస్టిక్ పరిశ్రమలు ఏర్పాటు అయినవి.

అంటే 1945 నాటికి భారతదేశంలోని కంపెనీల సంఖ్య 14,859, చెల్లించబడిన మూలధనం 389 కోట్ల రూపాయలకు పెరిగాయి. 1945-47 లలో 2049 కంపెనీలు, 18.1 కోట్ల మూలధనంతో పాకిస్తానకు తరలి పోయినా, భారత దేశంలోని కంపెనీలు బాగానే అభివృద్ధిచెందాయి.

## స్వాతంత్ర్యానంతరం

1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, పారిశ్రామిక పురోభివృద్ధిని ఎక్కువ చేయడానికి నిర్ణయించిన తర్వాత భారతదేశ పారిశ్రామికరంగంలో ప్రశంసనీయమైన కృషి జరిగింది.

1947-55 సంవత్సరాలలో 17,000 క్రొత్త కంపెనీలు నెలకొల్పబడ్డాయి తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలో దాదాపు 1500 క్రొత్త కంపెనీలు, 250 కోట్ల మూలధనంతో నెలకొల్పబడ్డాయి. అదే సమయంలో ప్రభుత్వం రంగంలో అడుగుపెట్టింది. ఈ కాలంలో నెలకొల్పబడిన ప్రభుత్వ కంపెనీలు: సింద్రీ రసాయనిక ఎరువుల ఫ్యాక్టరీ, హిందూస్తాన్ నౌకా నిర్మాణ కేంద్రం, హిందుస్థాన్ క్రిమి సంహారకౌషధాల ఉత్పత్తి కేంద్రం, భారత ఎలక్ట్రానిక్స్ డివిజన్, ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, హిందుస్తాన్ యంత్రపు పనిముట్ల కంపెనీ, హిందుస్తాన్ అంటిబయోటిక్స కంపెనీ, ఈస్టరన్ షిప్పింగ్ కార్పొరేషను, ఫెర్టిలైజర్సు అండ్ కెమికల్సు తిరువాన్కూర్ లిమిటెడ్ తిరువాన్కూర్-కొచ్చిన్ కెమికల్సు లిమిటెడ్.

మేనేజింగ్ ఏజెన్సీ విధానం. గత శతాబ్దం చివరిభాగంలో అమలులోకి వచ్చింది. కలకత్తాలోని మెసర్సు ఆర్, గిల్లెన్ అండ్ కో కు చెందిన జాన్ లెవ్ ఆర్. సెలిస్టర్ గిల్లెన్, మేనేజింగ్ ఏజెంట్లుగా, కంపెనీ వాటాదార్లకు ఒక ఒప్పందాన్ని కుదిర్చినట్లు, ఆనాటి నుండీ అనేక రకాల మేనేజింగ్ ఏజన్సీలు అమలులోకి వచ్చినట్లు చెప్పబడుతున్నది. ఈ పద్ధతిని మొట్టమొదట బ్రిటిషు వ్యాపారస్తులు అవలంబించారు. తర్వాత అది భారత దేశానికి వచ్చింది.

1955 లో 4900 కంపెనీలకు మేనేజింగ్ ఏజెంటుగావ్యవహరిస్తున్న కంపెనీలు 3,90 వున్నట్లు తేలింది. మద్రాసు, బొంబాయి, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలో సేకరించిన వివరాలనుబట్టి 450,300, 1500 ల మేనేజింగ్ ఏజన్సీ లున్నట్లు తేలింది. మేనేజింగ్ ఏజెన్సీల విధానం అనేక క్లిష్ట వ్యవహారాలతో కూడి వున్నందున, వాటిని గురించి సుదీర్ఘ పరిశీలనలు జరిపి, రానున్న సంవత్సరాలలో నిర్ణయాలను ప్రభుత్వం రూపొందించ వలసింది.

# సమయానుకూలంగా రేట్లు హెచ్చింపు!

## —బస్సు ప్రయాణీకుల పరిస్థితి

శ్రీ రేకపల్లి సత్యనారాయణమూర్తి

దేశంలో రవాణా పరిశ్రమలో అగ్రస్థానం రైల్వేది. తదుపరి స్థానము మోటారుబండ్లకు చెందుతుంది. అట్టి ద్వితీయ స్థానమాక్రమించుచున్న మోటారురవాణాపరిశ్రమ ఆంధ్రదేశము లోని పరిశ్రమలలో కెల్లా చాల పెద్దది.

ఇందు మూడువేల పైచిలుకు యజమానులు, పదునెనిమిదికోట్ల రూప్యముల పెట్టుబడి పెట్టి సుమారు 3 వేల బస్సులు, 35 వందల లారీలు, 70 టాక్సీలవరకూ నడుపుతున్నారు. ఈ పరిశ్రమపై నాధారపడి జీవించువారు 45 వందలమంది వరకు వున్నారు.

ఇది పెద్దపరిశ్రమే మరి! కాని ఇంక ఏ పరిశ్రమ కల్గని అవకతవకలు కలవు. కొన్ని ప్రాంతాల్లో రోడ్లు బాగులేక, రోడ్లు మరామత్తులమూలంగానూ, రోడ్లు హీన స్థితిమూలంగా బండ్లకు పెట్టుబడిఎక్కువగా పెట్టవలసి వస్తున్నందునా, ప్రభుత్వపు ప్రత్యక్ష పరోక్షపన్నుల విధింపు మూలమున, పెట్రోలుపై అదనపుపన్ను వసూలు చేస్తున్నందువలన ఈ రవాణా పరిశ్రమ కొంతవరకు కష్టముల నెదుర్కొనవలసి వస్తున్నమాట వాస్తవమే! కాని ఎట్టిలాభమూ లేనిది 32 వందలమంది యజమానులీ పరిశ్రమలో అడుగు పెట్టుట పొస్యాస్పదము.

నేటి బస్సుల యజమానులు వసూలు చేసేటి రేట్లు ఒక స్థిరరూపాన్ని పొందిలేవు. ఏకమార్గములోనైనా వీరిదారులు, అటుపై ప్రతిమైలుకు ఏను పైసలు చొప్పున వసూలు చేయవలెనని బోర్డులు మాత్రము బస్సులలో కట్టేవారు. వసూలు చేసే రేట్లకునూ వాటికినీ ఎట్టిసంబంధమూ వుండదు.

నేను ముఖ్యముగా ఉభయగోదావరి కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలో బస్సులలో అనేకమార్లు ప్రయాణము చేసియుంటిని. ఆంధ్రకు ఆయువుపట్టు అయిన యీ ఆరు జిల్లాలలో సుమారు 3 వేల లారీలు, 15 వందల బస్సులూ కలవు. వీటి బస్సులయినా ఎక్కే, ఎప్పుడైనా ఎక్కి, చూడండి. కాండీలో జనాన్ని కూరోవేసేని బస్సు ఒక్కటీకూడా చూడరు. అన్నింటిలో ముందుసీటులో పోలీసువాళ్లు ఉన్నతోద్యోగి వున్నాసరే, వెనుకబాడీలో జనాన్ని కూరోపెడుతాడు. మరి యీ అదనపు సొమ్ము యజమానికి చేరుతుందో చేరదోకాని!

ఇహ బస్సులవాండ్లు ప్రయాణీకులను పెట్టే బాధలు ఇన్నీ, అన్నీ కావు. రైల్వేలో మనిషి ఒకటికి 25 సేర్ల బరువుగల సామానును అదనపుచార్జీ చెల్లించకుండగనే తీసుక పోవచ్చును. కాని బస్సులలో అధమము 5 సేర బరువుగల సామానునుకూడ ఛార్జీ లేకుండా తీసుకపోవుటకు వీలు లేదుకదా! ఖాళీ ట్రంకు పెట్టికి కూడా డబ్బు తీసుకుంటున్నారు. పోనీ టిక్కట్టు వ్రాసియిస్తారేమో అంటే, అదీలేదు. ఎవరైనా గట్టిగా దబాయించి అడిగితే అసలు కారులో ఖాళీ లేదు పొమ్మంటున్నారు. ఇది వరుస. ఇంక ప్రయాణీకు డేంచేస్తారు? విధిలేక వాడన్న డబ్బులే యిచ్చి, బస్సు ఎక్కవలసి వుంది. సరే రేట్లుకూడా ఎల్లప్పుడూ ఒకేలాగుండవు. 'సమయానుకూలముగ రేట్లు మార్చబడును' అనే నాటకాల పద్ధతిగా మారాయి యీ బస్సు రూట్లలోని రేట్లు. దీన్ని అడిగేవారు ఎవరు? ఎవరైనా గట్టిగా అడిగినా ఇంక వాడికి పోడానికిమార్గం లేదు. పోనీ ఆ బస్సునంబరు నోటుచేసి రీజియనల్ ట్రాన్స్‌పోర్టు ఆఫీసుకు ఏదైనా అర్జీ పంపుకొందామా అంటే వారు సంవత్సరాలు గడిచినా జవాబు వ్రాయరు. ఇహ ఈ బస్సులవాండ్లతో ప్రజలు వేగేదెట్లు?

ప్రజలు ఈ ఇబ్బందుల బారినుండి విముక్తి పొందుటకు కొన్ని సూచనలు కలవు. నిజానికి ఓవర్‌లోడుచేసి ప్రయాణీకులను ఇబ్బందులు పెడుతున్నది. పాపం కొన్ని బస్సులవాళ్ళు! ఏకైకట యజమాని క్షయభర్తులలో వుంటున్నారు మరి, పాపం కొందరికి ఓవర్‌లోడూ చెయ్యడంలేదు, వేరే కాని వీళ్లలో బస్సులూ నడుపుమూ దేదుకోను; ప్రమాదము వచ్చిపోదు. కొందరు క్రొత్తగా ఇప్పుడు యిళ్లలో ఏకకేవట యజమానులకు రూట్ల నిచ్చుట, రెండవ విషయం ఏ బండిపైనైనా ప్రయాణీకుడు ఆధారములతో చేసిన ఫిర్యాదును ప్రాంతీయ రవాణాశాఖాధికారి తక్షణం జాగ్రత్తగా పరిశీలించి ఆ బండివానిని శిక్షించుట. అన్నిటికంటె ఉత్తమ మార్గము తిరువాన్కూరు కొచ్చిన్‌లోవలె ఈ రవాణాను జాతీయం చేయుట. దీని మూలమున ప్రభుత్వమునకు అదనపు ఆదాయము వచ్చుటయేగాక, ప్రజలెందరు సుఖంతురు. ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ప్రభుత్వం తక్షణ శ్రద్ధ వహించి, ఆంధ్రలో మోటారు రవాణాను జాతీయం ప్రాదుముగా ఉద్ధరించుట అవసరము.

# ద్వితీయప్రణాళిక ప్రారంభోత్సవాలు

## బందరులో

బందరు, ఏప్రిల్ 3. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభోత్సవాలు ఆంధ్రలో పెక్కుచోట్ల వైభవంగా జరిగాయి. గ్రామస్థులు అమితోత్సాహముతో వీటిల్లో పాల్గొన్నారు. ఈ సందర్భంలో సభలు, ఊరేగింపులు చేశారు.

బందరులో కృష్ణకిశోర్ టాకీసులో జరిగిన సభకు శ్రీ జి. వెంకటస్వామి నాయుడు అధ్యక్షతవహించి ప్రణాళికను ప్రారంభించారు. కార్యక్రమాలను శ్రీ కె వెంకటరావు, శ్రీ కె పురుషోత్తంనాయుడు నిర్వహించారు.

## హిందూపురం

శ్రీ కె శివప్ప అధ్యక్షతన వూరేగింపు జరిగింది. శ్రీ టి. గురుమూర్తి పతాకం ఎగురవేశారు. విద్యానికేతన్ పార్కులో భారత సేవక సమాజ్ ఆధ్వర్యాన శ్రమదానం జరిగింది.

కొడిగేపల్లిలో వూరేగింపు అస్పృశ్యతానివారణ ప్రచారం, ఆటలపోటీలు నిర్వహించారు.

## పెనుకొండ

శ్రీ యస్. యస్. సాలమన్ అధ్యక్షతన వూరేగింపు జరిగింది. సభలో శ్రీ కె. సత్యనారాయణరావు ప్రసంగిస్తూ ద్వితీయప్రణాళిక వివరించారు. వ్యవసాయ ప్రదర్శనం నిర్వహించారు. రాత్రి హరికథాకాలక్షేపం మరునాడు గ్రామపారిశుధ్య కార్యక్రమం నిర్వహించారు. మడకశిర, చెన్నేకొత్తపల్లి తాలుకుల బ్లాకులలోకూడా వుత్సవాలు జరిగాయి.

## చిత్తూరు

శ్రీ పి. రాజగోపాలనాయుడు అధ్యక్షతన ప్రారంభోత్సవం జరిగింది. శ్రీ యాగంటి ప్రారంభంచేశారు. ద్వితీయ ప్రణాళికాకాలంలో చిత్తూరుజిల్లాకు రు 12 కోట్లు కేటాయించినట్లు తెలిపారు. శ్రీయుతులు సి. వి. అయ్యరు, జి. రామమూర్తి, యస్. వి. జగ్గారావు జి. కె. స్వామి, విశ్వనాథం ప్రభృతులు మాట్లాడారు. శ్రీ గాదిరాజు రామమూర్తి వందనమర్పించారు.

## జగ్గయ్యపేట

శ్రీ రంగారావు సోషల్ క్లబ్ ఆవరణలో ద్వితీయప్రణాళిక ప్రారంభోత్సవసభ జరిగింది. ఊరేగింపు పశుప్రదర్శనం నిర్వహించారు. సాయంత్రం జరిగిన సభకు శ్రీ జి. నారాయణరావు అధ్యక్షత వహించారు. చి॥ కె. వి. లక్ష్మీకుమారి భరతనాట్యం ప్రదర్శించింది. ఆమెకు రు 201 బహూకరించారు.

శ్రీ వి. మహేశ్వరరావుగారు మాట్లాడుతూ ద్వితీయ ప్రణాళికాకాలంలో పరిశ్రమలకిస్తున్న ప్రాధాన్యం, రహస్య ఓటింగుల పహాయం వివరించారు. ప్రభుత్వము చేయగల సహాయ కార్యక్రమాలను తెలిపారు. కాకినాడ, రేణిగుంట లలో బట్టమిల్లుల స్థాపనావకాశాలు వివరించారు. పొదుపుగా వాడుకునే అలవాటు నేర్చుకోవాలని కోరారు. శ్రీ రేపాల బుచ్చిరామశ్రేష్ఠి మొదటి ప్రణాళిక సాధించిన విజయాలు పేర్కొన్నారు. శ్రీ చిల్లకంటి పూర్ణచంద్రరావు వందనమర్పించారు. కుమారి స్వర్ణ, గిరిజ, సుందరి మంగళగీతాలు పాడారు.

## తాడేపల్లిగూడెంలో

ద్వితీయ పంచవర్షప్రణాళిక ప్రారంభోత్సవాలు మొన్న ప్రారంభమైనవి. ఈ ఉత్సవాలు వారంరోజుల పాటు తాలూకాలోని అన్ని ఫిర్కాలలో జరుపుతారు.

నిన్న ఉదయం తాలూకా కార్యాలయంవద్దనుంచి వూరేగింపు బయలుదేరింది. ఊరేగింపులో బాలబాలికలు, ఉపాధ్యాయులు, ప్రభుత్వోద్యోగులు కాంగ్రెసు కార్యకర్తలు మొదలగువారు పాల్గొన్నారు.

తరువాత తాలూకా కార్యాలయ ఆవరణలో తహసీల్దారు శ్రీ లంక అగ్నిహోత్రుడు అధ్యక్షతన సభ జరిగింది. మొదటి పంచవర్ష ప్రణాళికవల్ల వచ్చిన ఫలితాలను శ్రీ వేలగల దానిరెడ్డి వివరించారు.

రెండవ పంచవర్ష ప్రణాళిక వల్ల కలిగేఫలితాలను శ్రీ ఆళ్లం మాణిక్యాలరావు చెప్పారు. వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్ శ్రీ వెంకటేశ్వరరావు వ్యవసాయంలో ఇప్పటివరకు వచ్చిన అభివృద్ధి రెండవ పంచవర్ష ప్రణాళికలో జరగనున్న కార్యక్రమాలు తెలియజేశారు, లోకల్ ఫండ్ ఆస్పత్రి డాక్టరు ప్రసంగిస్తూ, ఆరోగ్యం కాపాడడానికి ప్రణాళికల ద్వారా తీసుకుంటున్న చర్యలను వివరించారు బాలబాలికలకు మిఠాయి పంచిపెట్టారు.

# గోదావరి పుష్కరాలు

## గోష్పాదక్షేత్రంలో ఏర్పాట్లు

కొవ్వూరు, ఏప్రిలు 4: పోలీసు డిప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరలు శ్రీ కె. ఆర్. రాఘవన్ (వాల్తేరు) జిల్లా సూపరింటెండెంటు శ్రీ వి. యం. రోషణ డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు మల్లికార్జునరావు నిన్న సాయంత్రం కొవ్వూరు రైల్వేస్టేషను పరిసరప్రాంతమున కొవ్వూరు గోష్పాద క్షేత్రమున గోదావరిపుష్కర యాత్రీకులకు చేయవలసిన ఏర్పాట్లు విషయం పరిశీలించారు.

స్టేషనుమాస్టరు యాత్రికులకు రైల్వే అధికారులు చేయనున్న సౌకర్యములను గురించి తెలియజేశారు. ప్రయాణీకులు నిమార్గముగుండా రాకపోకలకు ఏర్పాటుచేస్తున్నారు అని డిప్యూటీ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ అడుగగా అచ్చట నున్న పెద్దగొయ్యిలో కాలిబాట ఏర్పాటుచేస్తారని తెలిపారు. ఈ గొయ్యిని పూడ్చవలెనని చాలాకాలంగా ఆందోళన చేస్తున్న విషయం జ్ఞప్తి చేయగా పూడ్చుటకు అంచనాలు తయారైవున్నవని ప్రస్తుతము ఆ పని చేయుట పూర్తికాదనియు స్టేషన్ మాస్టరు చెప్పారు. ఈ గొయ్యను పూడ్చనిచో ఇల రైల్వేవారు చేసిన సౌకర్యములన్నియు వమ్మయిపోవునని శ్రీ శర్మ తెలియజేశారు.

డిప్యూటీ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరలు శ్రీ రాఘవన్‌గూడా, ఈ గొయ్యిని పూడ్చడం అవసరమనే అభిప్రాయపడ్డారు. (స్వ. వి.)

## తెనాలి తాలూకా గ్రామ కాంగ్రెసు సంఘాలు

తెనాలి, ఏప్రిల్ 3: తాలూకాలోని వివిధ గ్రామాలలో కాంగ్రెసు సంఘాలు తాత్కాలికంగా ఏర్పాటైనవి.

మొదలిపాడు—అధ్యక్షుడు సూర్యదేవర కోదండరామయ్యగారు, కార్యదర్శి పాలడుగు శివరామయ్యగారు, సభ్యులు గొట్టుముక్కల అబ్బయ్య, తేకూరు రామబ్రహ్మం, వట్టికూటి వెంకటకిష్టయ్యగారు.

చినలూరు—అధ్యక్షుడు ఆళ్ల సుబ్బారెడ్డిగారు, కార్యదర్శి కొండా సుబ్బారెడ్డిగారు, సభ్యులు బొంతు మల్లికార్జునరెడ్డి, పుయ్యూరు వెంకటేశ్వర రెడ్డి, బొంతు సుబ్బారెడ్డిగారలు.

వలివేరు—అధ్యక్షుడు తమ్మా శేషిరెడ్డిగారు, కార్యదర్శి దొడ్డపనేని సత్యనారాయణగారు, సభ్యులు కొండమూడి వెంకటేశ్వర్లు, చీడెపూడి రామకృష్ణారెడ్డి, మంచాల జీవరత్నం గారలు.

చినపరిమి—అధ్యక్షుడు ముక్కామల వెంకట సుబ్బయ్యగారు, కార్యదర్శి అవుదు జయరామిరెడ్డిగారు, సభ్యులు కొల్లిపర గజావల లింగం, సముద్రాల సోమయ్య, చందోలు దల్లయ్యగారలు.

మోపర్రు—అధ్యక్షుడు పల్లెంపాటి నాగేశ్వర రావుగారు, కార్యదర్శి యడ్లపల్లి సీతారామయ్యగారు, సభ్యులు కొడాలి లక్ష్మీనారాయణ, కొడాలి సుబ్బారావు, చిక్కాల యేసుదాసుగారలు,

శృంగారపురం—అధ్యక్షుడు కోగంటి రామయ్యగారు కార్యదర్శి పుచ్చా సత్యనారాయణగారు, సభ్యులు పెందుర్తి అంజయ్య, గోగినేని కృష్ణయ్య, శృంగారపాటి మోషె గారలు.

మంచికలపూడి—అధ్యక్షుడు వేదాంతం శ్రీనివాసాచార్యులు గారు కార్యదర్శి యెమినేని సాంబశివరావు గారు సభ్యులు మంచికలపూడి సూర్యనారాయణ మిట్టా మల్లికార్జునరావు లోకం రామచంద్రరావు జెవధర్తుని సత్యనారాయణ ఆరాధ్యుల వెంకటస్వామిగారలు.

పెదపరిపాలెం—అధ్యక్షుడు ముక్కామల సుబ్బారావుగారు కార్యదర్శి బొల్లుపూమ మహేశ్వరరావుగారు సభ్యులు బొల్లు కుటుంబరావు బొల్లు వెంకటేశ్వరరావు బొల్లు ప్రకాశరావు గారలు.

గోవాడ—అధ్యక్షుడు తుమ్మలబాపయ్యగారు కార్యదర్శి పావులూరు శివరామకృష్ణయ్యగారు సభ్యులు కొవ్వూరు బాపయ్య, మండవ సుబ్బరామయ్య అల్లినేని రామకృష్ణయ్య గారలు,

కంచర్లపాలెం—అధ్యక్షుడు ముక్కపల్లి వెంకటసత్యనారాయణగారు కార్యదర్శి గాలి నరసయ్యగారు సభ్యులు గొల్లపల్లి వీరయ్య ముక్కపల్లి రాఘవయ్య, కోపల్లె నాగభూషణం, ముక్కపల్లి వీరయ్య గారలు.

పాండురంగాపురం—అధ్యక్షుడు—లింగినేని రామకోటయ్యగారు, కార్యదర్శి—గవిని భీమశంకరరావు గారు, సభ్యులు—లాం వెంకటేశ్వరరావు పొదరి, మునుమూరి చినవీరరామయ్య శరణు లక్ష్మీనారాయణ గారలు.

ఈమని—అధ్యక్షుడు—కొత్తారి రామస్వామి గారు, కార్యదర్శి—అంబా నరసింహారావు గారు, సభ్యులు—కస్తాల వెంకటసుబ్బయ్య, బండి సుబ్బారావు, పులిపాటి అన్నప్ప గారలు.

నడిగడ్డపాలెం-అధ్యక్షుడు—మండలపు చంద్రశేఖరరావు గారు కార్యదర్శి—రాజగోపాలరావు గారు సభ్యులు—కూచంనేని సీతారామయ్య నాదకూరు సీతారామయ్య, దేవాబి సుందరరావు, వట్టికూరు సుబ్బారావు, వేములపల్లి తిరుపతయ్య గారలు.

# కృష్ణాజిల్లాలో రెండవ పంటకు నీటికొరత

## జిల్లాకాంగ్రెసు కార్యదర్శి విజ్ఞప్తి

బందరు, ఏప్రిలు 3: పూర్వ కృష్ణా జిల్లా కాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీ మండలి వెంకటకృష్ణారావు యీదిగువ ప్రకటన చేశారు.

"బందరు, కైకలూరు తాలూకాలలో దాళ్వాకు కావలసినంత నీరు లభించగలదని ముందుగా అధికారులు ఇచ్చిన హామీపై, రైతులు క్రిందటిసంవత్సరం కంటె ఎక్కువ దాళ్వాసాగు ఉత్సాహంతో చేశారు. కాని నీరు సరిగా అందక బందరు, కైకలూరు తాలూకాలలోని చివరప్రాంతాలలో ఈ ద్వితీయ దాళ్వాసాగు దాదాపు 10 వేల ఎకరాలు మాడిపోయింది. ఈ నీటికొరత వలన ఏర్పడిన విషమపరిస్థితిని ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డికి విన్నవించాము. శ్రీ సంజీవరెడ్డి ఇంజనీర్లతో మాట్లాడి తుంగభద్రనీరు ఇంకా వెయ్యిక్యూ. ల అదనుగా ఎక్కువ వదిలే ఏర్పాటుచేశారు. మార్చి 31 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి కైకలూరుతాలూకా పర్యటనలో రైతుల కష్టాలను స్వయంగా చూచారు. నాడు ఏ గ్రామములనైనా దాళ్వా నీటికొరత వల్ల చేలు మాడిపోతున్నాయని రైతులు విన్నవించుకున్నారు. పి. డబ్ల్యు. డి. అధికారులను పిలిపించి నీటి సరఫరా సరిగా జరుగుటఏర్పాట్లు చేయించాల్సిందిగా శ్రీ గోపాలరెడ్డి చెప్పారు.

తుంగభద్రనీరు ఎక్కువగావదిలినప్పటికీ బందరుతాలూకాలోని మల్లేశ్వరం ఫిర్కా, కైకలూరు తాలూకాలోని వడాలి, కలిదిండి, కైకలూరు మొదలైన ఫిర్కాలు కాలవలకు చివరప్రాంతాలగుటచే నీరు సరిగా సరఫరాకావటము లేదు. సారాస్థాన్యాన్ని అమ్మి దాళ్వా ఖర్చులకు పెట్టిన రైతాంగము దాళ్వా కూడ నోటికిరక్కబోతోందని ఆందోళన చెందుచున్నారు. అందుచే పి. డబ్ల్యు. డి. అధికారులు, ప్రత్యేకశ్రద్ధతో ఈ ప్రాంతాలలో నీరు సమయమునకు అందునటు కృషి చేయగలందులకు కోరుచున్నాను.

## చిత్తూరుజిల్లాలో మే నెలలో భావే పర్యటన

చిత్తూరు, ఏప్రిల్ 4: ఆచార్య వినోబాభావే, మేనెల 8 తేదీ నుంచి 12 తేదీ వరకు చిత్తూరుజిల్లాలో భూదాన యాత్ర జరుపుతారు. ఇంతవరకు ఈ జిల్లాలో 8000 ఎకరములు సేకరింపబడినవి. శ్రీభావే వచ్చేలోగా 10,000 ఎకరములకు పైగా సేకరించవలసివున్నదని జిల్లా కాంగ్రెసు నాయకులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, భూస్వాములు, తదితర సామాజిక పనులు యీదరిద్ర నారాయణ సేవలో పాల్గొని అధికంగా భూదాన వ్రతము నవలంబించాలని జిల్లా భూదాన సమితి సంచాలకుడు ఎన్. రాధాకృష్ణయ్య శెట్టి విజ్ఞప్తిచేస్తున్నారు.

## సమితి కార్యదర్శికి అరబ్ రాజ్యాల సమాధానం

కైరో, ఏప్రిల్ 6: రేపు జరిగే అరబ్ దేశాల విదేశాంగ మంత్రుల సమావేశంలో సమితి కార్యదర్శి హామర్ షెల్డ్ అరబ్ రాజధానుల సందర్శన సందర్భంలో ఆయనకు అరబ్ రాజ్యాలు యివ్వవలసిన సమాధానం గురించి చర్చిస్తారని ఒక ప్రకటన తెలుపుతుంది. జోర్డాన్ నదీజలాల వినియోగం గురించి అరబ్ వైఖరిని నిర్ణయిస్తారట.

